సంపుటము 5] మార్చి, 1919 [సంచిక 9

# బాలమిత్ర



## వైద్యపు పక్షి

ఒకనాడొక దొర తన గదియందు గూర్చుండి చదువుకొనుచుండెను. అతని కిటికీ కెదురుగ కొన్ని పక్షులు నివసిం

చెను. అందు ఒకజత గూటిని కట్టుకొన నారంభించెను. అవి తడిమన్ను తమ ముక్కులతో గొనివచ్చి గోడమీద చాల కష్టముతో కట్టుకొనుచుండెను. కొంచెముసేపు కట్టుచు, దగ్గర నున్న చెట్టుమీదకుబోయి తాము కట్టిన దెట్లున్నది చూచుచు మరలవచ్చి చక్కబరచుకొనుచు కట్టుచుండెను. కట్టినది తగిన రీతిగా నుండనియెడల వచ్చి పడవేయుచుండెను. ఇట్లుండగా నొకమాఱు సగమువరకు పడద్రోసెను. ఇట్లు చేయుటలో ఆడపక్షి కా యింటిలోని అద్దపుముక్క కాలికికోసికొని గాయ ముపడెను. అది గూటిని కట్టుకొనవలెనను పని తొందరలో నున్నందున దానిని లక్ష్యపెట్టకపోయెను. తానిక యెంత మాత్రము పనిజేయలేక పోవునంతవరకది ఏదో యొక పని జేయుచునేయుండి చివరకు అలసిపోయి క్రిందపడి మూర్ఛిల్లెను. అంతట మగపక్షి దానివంక మిగుల పరితాపముతో జూచి, కీచుకీచు మని ఒకమాదిరిగా మూఁడు మారు లరచెను. కొంతసేపటికి వేరువేరు పక్షులు కొన్ని జరిగిన దేమిటో జూడ వచ్చెను.

ఆ వచ్చినవాటిలో నొక చిన్నపక్షిగలదు. దానికి వైద్యము దెలిసినటులుండెను. అది వెంటనే ఎగిరిపోయి, కొంచెము

సేపటిలో నొక గడ్డిపూచను, నోట గరచుకొనివచ్చి దానిని మెత్తగానమిలి దాని నా గాయమునకు పట్టించెను. తరువాత దాని నోటిలోకి కొంచెము నీరుతెచ్చిపోసి దాహముతీర్చెను. తరువాత దానిని మెల్లగా ఆ సగము గూటిలోకి జేర్చుటలో సహాయముజేసి దానినికట్టి ముగించెను. ఆ పిదప అది తన గూటికి ఎగిరిపోయెను.

అక్కడ కూర్చుండి కనిపెట్టుచుండిన దొర ఆ పక్షి చేసిన సహాయముకంటె ఎక్కువ చేయగలడా!

---

# బడిపిల్లలనుగూర్చిన పాట

హిందూస్థానికాఫి

పల్లవి

పంతులయ్యావస్తాడు పాటాలడుగుతాడు యింతైన
రాదబ్బా గోరంతైనరాదబ్బా చీమంతైనరాదబ్బా బొంత
దయ్యమైనవచ్చి పంతులయ్యవారిబట్టి గొంతుపిసికిపోదబ్బా.

1. పలక పగిలిపోయె బలపము పడిపోయె పద్యాలు రావాయె, పలక బలప మేదని పిలకబట్టి లాగుతాడు చెలికాడ యింకెట్లా, చలిజ్వరమైన రాదెట్లా, తలనొప్పైన రాదెట్లా తెగులైన రాదాయె.

2. ఎక్కాలబుక్కు చించి ఒక్కొక్క కాగితము చక్కెర పొట్లము కట్టితి, నే ఆకుల్ వక్కాల్ కట్టితి, నే కారపూసల్ గట్టితి, నే గాలిపటాల్ గట్టితి, లెక్కబుక్కు లేదాయె ముక్కైన రాదాయె ఎక్కాలు మరచిపోతి, నన్ను పక్కలిరుగ తన్నుతాడు, నా చెక్కిళ్లు గిల్లుతాడు, మెడబట్టి నొక్కుతాడు.



# చేతికిఁ దొడవులు



రాణిగారిచేతికి రాజదండము తొడవు.

భటునిచేతికి కత్తి కలదు.

వడ్రంగిచేతికి ఱంపము కలదు.

కమ్మరివానిచేతికి సమ్మెట కలదు.

కాపువానిచేతికి నాఁగలి కలదు.

గనులు త్రవ్వువానికి గొడ్డలి కలదు.

ఓడ నడపువానికి తెడ్డు కలదు.

చిత్రపటములు వ్రాయువానికి కుంచె కలదు.

ఱాతిబొమ్మలు చెక్కువానికి ఉలి కలదు.

కవిచేతికి కలము కలదు.

స్త్రీచేతికి సూది కలదు.

నీ చెయ్యి యేపని చేయవలసియున్నను నీ బలమంతటి తోను చేయుము.

---

# ప్రతి ధ్వని

ఒకనాడు విజయుడను బాలుడు ఒక కొండప్రక్క నాడుకొనుచుండెను. ఆ దినమున చుట్టును బహు రమ్యముగా కనుబడుచుండెను. భూమియంతయు పచ్చని తివాసి పరచినట్లు పచ్చికచే కప్పబడి యుండెను. దానియందు చక్కని పువ్వులు కన్నుల కింపు గొలుపుచుండెను. పశువులును గొర్రెలును బహు సంతోషముతో మేయుచుండెను. వాటికాళ్ల తాకుడుచే నెగిరిపడు మిడుతలను దిన నై తెల్లని కొంగలు అచ్చటచ్చట చెదరియుండెను. చెట్లపై పక్షులు

కిలాకిలా రావములు సలుపుచుండెను. అప్పటికి నాలుగుబారల ప్రొద్దెక్కియుండెను గాన సూర్యతేజస్సు బహురమ్యముగా నుండి లేనియుత్సాహమును కలిగించుచుండెను.

ఇట్టి దివ్య దర్శనముచే సంతోషభరితుడై విజయుడు "హూత్, హూత్, హూత్త" ని కేకలు వేసెను. ఆ మాటలు నోట జారినవెంటనే "హూత్, హూత్, హూత్త" ని మరల వినబడెను. విజయు డదివర కెన్నడును ప్రతి ధ్వనిని వినియున్నవాడు కాడుగాన;

"ఎవడ్రా అది?" యని యరచెను.

"వడ్రా అది" అని వినబడెను.

"పిచ్చా యేమి?" అని విజయుడు కఠమెత్తి బలికెను.

"చ్చా యేమి?" అని మరల బిగ్గరగా వినబడెను.

అంతట కోపము బట్టజాలక విజయుడు నోటికివచ్చిన ట్లెల్ల వదరెను. అనరాని మాటలనెను. అతడన్న మాటలన్నియు పొల్లుపోకుండ మరల వినబడెను.

చాటుననుండి అట్లు తన్ను వెక్కిరించుచుండువా డెవడైనది గుర్తించజాలక చాలకోపముతో తల్లియొద్దకుబోయి

జరిగినదంతయు చెప్పివేసి, ఆ తిట్టినవాడెవడని యడిగెను. అందుకామె;

"విజయా! నీవన్న మాటలనే మరల వింటివి. నీవు చెడ్డ మాట లన్నందున అవే నీకు వినబడెను. నీవు దయతో మాట లాడియుండిన అవి నీకు వినబడియుండును." అని చెప్పెను.

తే. గీ. చెడ్డమాటలుసెప్పిన చెడ్డవిగను
మంచిపల్కులుపల్కిన మంచివిగను
ప్రతిధ్వనించునుగావున బలుకుమెపుడు
సద్వచనములెనీవిక సరగవిజయ!.



# బల్లులు



ఇండ నేకవండల జాతులున్నవి. వాటికన్నిటికిని దేహము పొడవైనది. దేహముపైన పొలుసులుండును లేక చర్మము గరిగరిగానుండును. వాటికి చాలామట్టుకు నాలుగేసికాళ్లుండును, వేళ్లకు వంపుగలగోళ్లున్నవి. వాటికను రెప్పలు మూతలు పడును, వాటికి నోట పండ్లున్నవి. వాటికి తోక యొకటికూడా గలదు. కొన్నిబల్లులు మిగుల నెమ్మదిగా నడచును. కొన్ని బహువేగముగా బరుగెత్తును.

## ఇండ్లయందుండు బల్లి

ఇందు సుమారు అరువది భేదములు గలవు. అవి సకల దేశములయందును యున్నవి. వీటితల వెడల్పుగాను, పలుచగాను ఉండును. మెడ పొట్టిగాను మొండెము దళముగాను ఉండును. తోక దేహముకంటె పొడవుగానుండదు. కాళ్లు పొట్టిగాను లావుగానుండును. వేళ్లు నానాజాతులయందు నానావిధములుగా నుండును.

వాటిపాదములు, గోడలనెక్కుటకును దద్దళములపై తల క్రిందుగా ప్రాకుటకును తోడ్పడును. కొన్నిటికి వాడియైన గోళ్లుగలవు. వాటి సహాయముతో గోడను రాళ్లను యెక్కి కన్నములను వెదకి వాటియందు అవి కడుపుపైకిపెట్టి పగలెల్ల కదలకుండా దాగియుండును. సంధ్య చీకటిపడినప్పుడు కన్నములలోనుండి బల్లులు బైలువెడలి పురుగులను వెదకును. అవి ఒక్కమారు హఠాత్తుగా దుమికి పురుగులను పట్టుకొనుచుండును. వాటిని మచ్చికచేసినచో ప్రతిదినమును వచ్చి మేత తినిపోవును.

బల్లి పైనుండి నేలమీదపడినప్పుడు, ఒకప్పుడు దాని తోక విరిగి ఊడిపోవును. ఒకమా రొక తేలు ఒకబల్లిని పట్టుకొని

దానిని తోకమీద కుట్టగా ఆ బల్లి తోకను వదలివేసి పారి పోయెను. అయినను వానికి మరల తోకవచ్చెను.

---

# యోబు

అరబ్బీదేశములో అనేక సంవత్సరముల క్రిందట యోబు అనే ఒక సజ్జనుడు వుండెను. అతనికి కొందరుపిల్ల లుండిరి. మరియు, అతడు తన దేశస్థులందరిలో మిక్కిలి ఘనుడు. దేవుడు యోబును శోధించుటకై సైతానుకు సెల విచ్చెను. ఒకనాడు అతని గొర్రెలమందలును పశువులమంద లును అగ్నిచేత దహింపబడినవనియు, దొంగలచేత అపహ రింపబడినవనియు, అతని పిల్లలందరు చంపబడిరనియు, ఒకని వెనుక నొకడు యోబుతో ఈ సమాచారములను చెప్పుటకు వచ్చిరి. కటకటాయని యోబు ప్రలాపించి తన బట్టలు చించుకొని నేలనుపడి,—“ప్రభువు దయచేసెను; ప్రభువు తీసికొనిపోయెను; ప్రభువు నామము స్తుతింపబడునుగాక” అని చెప్పెను.

తరువాత సైతాను పెద్ద వ్రణములతో యోబును కష్ట పెట్టుటకు దేవునివల్ల సెలవుపొందెను. యోబు బూడిదలో కూర్చుండి, ఒక చిల్లపెంకుతో తన కురుపులను గోకుకొనుచుండెను. తాను జననమైన దినమును శపించి మరణము నొందగోరెను. తుదకు దేవుడు తానే సుడిగాలిలోనుండి మాటలాడెను. అప్పుడు యోబు చాల ఖిన్నుడై,—ఇదిగో నేను నీచుడను, నీకు నేనేమి ప్రత్యుత్తరమిత్తును? అని చెప్పెను. అంతట దేవుడు యోబుకున్న వ్యాధిని తీసివేసి, పూర్వముకంటె ఎక్కువగా అతనికి పిల్లలను భాగ్యమును దయచేసెను.

దేవుడు యిష్టపడి మనుష్యులను దుఃఖపెట్టడు. మనము శోధింపబడినను, తొందరలు పొందినను, అది మన మేలుకొరకే.

యెహోవా ఇచ్చెను, యెహోవా తీసికొనిపోయెను, యెహోవానామము స్తుతింపబడును గాక.



# తల్లిదండ్రులకొరకు

ఖండన గద్దింపులకంటె యెక్కువగా మాదిరులు పిల్లలకవసరము. గనుక నీవు నీ పిల్లలకు మాటయందు క్రియయందు చూపునందు మంచి మాదిరిగా నుండవలెను.

పిల్లలు నడువవలసిన మార్గమునందు నడుచునట్లు ఆ మార్గమున నీవేనడువుము.

పిల్ల తప్పచేయునపుడు గద్దించుటతో తృప్తినొందకుము, అది సరియైనపని చేసినపుడు ప్రోత్సాహవాక్యములు పలుకవలెను.

తల్లియొద్ద పిల్ల నేర్చుకొన్నది యెన్నడైన మరువదు. కావున మంచివి యథార్థములైన సంగతులనుమాత్రమే చెప్పుము.

ప్రతి స్త్రీయొక్కయు పురుషునియొక్కయు ప్రవర్తన బాల్యముననే యేర్పడెను. ఆ ప్రవర్తన చెడ్డదైతే పిల్లలను బాల్యమున దిద్ది క్రమశిక్షలోనుంచలేదు. కాబట్టి మీ పిల్లలు సత్పురుషులుగాను స్త్రీలుగాను అనునట్లు ఆరంభమునుండి సరిగా తర్బియతు చేయవలెను. ఎంత పసివారినైనను తర్బియతు చేయవచ్చును.

# బాలమిత్ర టపా




ప్రియ బాలమిత్రులారా!

నేను ఇంతకాలమునుండి చదివెడి పత్రికలవలన నేను తిరిగి వ్రాయుటకు ఉల్లాసముకలిగెను. నేను సి. ఎమ్. ఎస్. బడిలో చదువుకొనుచున్నాను. మాబడిలో 120 మంది పిల్లలము ఉన్నాము. నేను 6 వ తరగతి. నా తరగతిలో 8 ఎనమండుగురు పిల్లలము. నా తరగతిలో నేను మొదటివాడను. నేను

బోర్డింగులో ఉండి చదువుకొనుచున్నాను. మా బోర్డింగులో 25 గురు పిల్లలము ఉన్నాము. మా బోర్డింగును చూచుటను మా సూపరెండెంటుగారగు వినుకొండ యేసుదాసుగారు ఉన్నారు. వారు ప్రతిరోజు సాయంత్రమును మా యింటికివచ్చి ప్రార్థన చేసి వెళ్లుదురు. శ్రీ. జాన్ కేయిన్ దొరవారును, దొరసానమ్మగారును మమ్ములను చాల దయతో చూస్తుండేవారు. అయితే శ్రీ. జాన్ కేయిన్ దొరవారు దేవునిసముఖమున నిద్రించినను ఎప్పటిలాగుననే జరుగుతుయున్నది. శ్రీ. జాన్ కేయిన్ దొరవారికి బదులుగా బోరహాందొరవారు ఉన్నారు. కేయిన్. దొరసానమ్మగారు మాకు ఆదివారపుబడులు పెట్టి దేవునిసంగతులు చెప్పుచున్నారు. ప్రియబాలమిత్రులారా! మనము, అనగా, యేసుక్రీస్తునామమును ధరించుకొన్న మన మందరమును క్రొత్తసంవత్సరములో ప్రవేశించితిమి. గనుక మనము దుష్ట స్వభావములను విడిచిపెట్టి క్రొత్త నడువడి గలవారమైయుండి మనము యేసుప్రభునామమును ధరించుకొందుముగాక. 3. ఆత్మ విషయమై దీనులైనవారు ధన్యులు; పరలోకరాజ్యము వారిది. 4. దుఃఖపడువారు ధన్యులు; వారు ఓదార్చబడుదురు. 5. సాత్వీకులు ధన్యులు, వారు భూలోక

మును స్వతంత్రించుకొందురు. 6. నీతికొరకు ఆకలిదప్పులు గలవారు ధన్యులు వారు తృప్తిపరచబడుదురు. 7. కనికరము గలవారు ధన్యులు; వారు కనికరముపొందుదురు. 8. హృదయ శుద్ధిగలవారు ధన్యులు; వారు దేవుని చూచెదరు. 9. సమాధానపరచు వారుధన్యులు; వారు దేవునికుమారు లనబడుదురు. 10. నీతినిమిత్తము హింసింపబడువారు ధన్యులు; పరలోక రాజ్యము వారిది.

మత్తయి. 5 వ అధ్యాయము. 3 వచనమునుండి 10 వచనమువరకు.

ఇట్లు

మీ ప్రియ బాలమిత్రుడు

కుప్పాల నతానియేలు

దుమ్ముగూడెము బోర్డింగు

---

C. L. S. PRESS, MADRAS—1919